# రామ థ ల ము

## బ్రహ్మజ్ఞానోద్బోధములు—IV.

గ్రంథకర్త:

మాదగంటి జగన్నశాస్త్రి, బి. ఏ.

'పల్లెటూరు గ్రంథమండలి'

సంపాదకుడు.

ముదిగంటి జగ్గన్నశాస్త్రి, బి.ఏ.

# రామతీర్థస్వామి

# బ్రహ్మజ్ఞానోద్బోధములు—IV.

1927

మొదటికూర్పు 1000

ఇతరులకు వెల 3 అణాలు.

రాజమండ్రి.

(తూర్పు గోదావరిజిల్లా.)

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1927

# 'పల్లెటూరు గ్రంథమండలి'

[illegible] ఉపాధ్యక్షులు.

1 శ్రీయుత దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు
పంతులుగారు, చెన్నపట్నం.

ఉపాధ్యక్షులు.

2 జంపన సుబ్బారావుగారు,
ప్రొప్రయిటరు, ఖండవల్లి.

3 పల్ల సూర్యనారాయణగారు,
వకీలు, కొవ్వూరు.

4 దామోజీపురపు సత్యాధిరావుగారు,
వకీలు, కొవ్వూరు.

5 బలిజేపల్లి సుబ్రహ్మణ్యంగారు,
వకీలు, కొవ్వూరు.

6. కళిదిండి గంగరాజుగారు,

తాడేపల్లిగూడెం.

7 రామానుజం రామారావుగారు,

రాజమండ్రి.

ప్రధానపోషకులు.

8 తల్లాప్రగడ కామేశ్వరరావుగారు,

ఉంగుటూరు.

9 తల్లాప్రగడ భీమేశ్వరరావుగారు,

ఉంగుటూరు.

10 డాక్టరు, జీడిగుంట కామరాజుగారు,

నిడదవోలు.

11 డాక్టరు, సత్తిరాజు వెంకట్రావుగారు,

అత్తిలి.

12 శివుడు శివరావుగారు,

కొవ్వూరు.

13 మల్లంపల్లి మల్లికార్జునరావుగారు,
కొత్తపల్లి అగ్రహారం.

14 చేడ నారాయణమూర్తిగారు,
కొండంగి.

15 ముళ్ళపూడి తిమ్మరాజుగారు,
తణుకు.

16 జాజాల చలమయ్యశాస్త్రిగారు,
కొవ్వూరు.

17 పులవర్తి లక్ష్మణస్వామిగారు,
ఆకివీడు.

18 పసల సోమయ్యగారు,
తాడేపల్లిగూడెం.

## పోషకులు.

19 గంధం వెంకయ్యనాయుడుగారు,
వకీలు, భీమవరం.

20 [illegible]పల్లి లక్ష్మీనారాయణగారు,
కొవ్వూరు.

21 డాక్టరు, యర్రమిల్లి దీక్షితులుగారు,
నిడదవోలు.

22 ఆచంట కృష్ణమూర్తిగారు,
మాధవరం.

23 డాక్టరు, నజీదు అహ్మదుగారు,
తాడేపల్లిగూడెం.

24 క[illegible]ారి అచ్యుతరామరాజుగారు,
ఒడ్డూరు.

25 రేకపల్లి వర్ఘులుగారు,
వకీలు, రాజమండ్రి.

26 గోడవర్తి నాగేశ్వరరావుగారు,
ఆచంట.

27 బోళ్ల వెంకటరత్నంగారు,
పెదపట్నమగ్రహారం.

28 తుమ్మలపల్లి సత్యనారాయణగారు,
పిప్పర.

29 తుమ్మలపల్లి లక్ష్మీనారాయణగారు,
పిప్పర.

30 యిందుకూరి సుబ్బరాజుగారు,
పిప్పర.

31 మాజేటి రామచంద్రరావుగారు,
ఏలూరు.

32 జోస్యుల రామచంద్రరావుగారు,
వకీలు, రామచంద్రపురం.

33 న్యాపతి సుబ్బారావు పంతులుగారు,
వకీలు, రాజమండ్రి.

34 జూపూడి సుబ్బన్నగారు,
ఆకివీడు.

35 పోలిన రాజు అనే రామచంద్రుడుగారు,

ములకల్లంక.

36 గాడేపల్లి హానుమానులుగారు,

అత్తిలి.

37 చిట్టూరి చినయింద్రయ్యగారు,

వకీలు, నర్సాపురం.

38 బొమ్మకంటి రామమూర్తి శర్మగారు,

నిడదవోలు.

గ్రామపోషకులు.

1 గద్దెమాణిక్యం సుబ్బారాయడుగారు,
తాడేపల్లిగూడెం.

ప్రధానపోషకులు.

2 దేవులపల్లి రామమూర్తిశాస్త్రిగారు,
అగ్రహారందారు, తిమ్మరాజుపాలెం.

3 విష్ణువఝ్ఝుల లక్ష్మీనారాయణగారు,
చిలకలంపాడు.

పోషకులు.

4 నసింపల్లి సుబ్బారాజుగారు,
కోమూరుపాలెం.

5 పేరిచర్ల సుబ్బారాజుగారు,
ర్యాలి.

6 పెనుమెత్స సుబ్బారాజుగారు,
మునసబు, కోటురు.

7 జగుమర్తి వెంకట సుబ్బారాయుడుగారు,

నాగుల్లంక.

8 కర్రి చినవెంకటరెడ్డిగారు,

మారుటేరు.

9 రావుసాహేబు కల్లి చిట్టి అబ్బాయినాయుడుగారు,

పూళ్ల.

10 మొనుమెత్స రాఘవరాజుగారు,

గోటేరు.

11 కర్రి శ్రీరామమూర్తిగారు,

ఏనుగుల మహాలు.

12 అరవ తిరుపతిరాయుడుగారు,

రాజమండ్రి.

13 పేరాలి సీతారామయ్యగారు,

తేతలి.

ఓం

# శ్రీ రామతీర్థస్వామి బ్రహ్మజ్ఞానోద్బోధములు.

## మతముయొక్క పరమావధి.

మతముయొక్క పరమావధి యేది? దానిని హైందవు లెట్లు సాధింప యత్నింతురు? వారిమత ప్రకారము ప్రతివాడును (పిపీలికాది బ్రహ్మపర్యంతము) భగవంతుడే! ప్రతివాడును అఖండసన్నిధియే! అనాదిరత్నమే! పరమానందకందమే! ప్రతివాడును భగవంతుడు; అతనిలోనే విశ్వమంతయు నుండును. అయినచో ప్రజ లేల బాధపడుచుందురు? అఖండసచ్చిదానందమతములో లేకపోవుటచే గాని, యమూల్యమణి

సమయం దంతర్హితముగా నుండకపోవుటచే గాని వా రెన్న డిట్లు బాధపడుట లేదు. వా రాపరమరహస్యము ను గుర్తింపకపోవుటే యీ యనర్థముల కెల్ల కారణ మగుచున్నది. మననిజాత్మను గ్రహింపజాలకుండుట ; యదార్థమైన యాత్మతత్త్వము ననుభవింపజాలకుండుట ; యివియే మన కడ్డుగోడలు. ఆత్మతత్త్వమును తెలుపుటే మతముయొక్క పరమావధి. మనబాహ్యవేషమును తీసివేయుటే మతప్రయోజనము. స్వయంకృతాపరాధముచే, మనస్వహస్తములతో, మనకర్మలచే మనమే మనలో నున్న యమూల్యమణుల నన్నిటిని మఱుగుపరచుకొని దౌర్భాగ్యులవలె వాపోవుచున్నారము. ఎమర్సనుకవి చెప్పినట్లు "ప్రతివాడును మూర్ఖశిరోమణి పాత్రను ధరించిన భగవంతుడే !"

అన్నిమతములును మనల నావరించియున్న మాయను నిర్వీర్యముచేయుటకును, చీల్చివేయుటకును నుద్దే

శింపబడినవి. ఇందులో కొన్నిమతము లీమాయ యను
తెరను కొంచె మించుమించుగా లేనట్లు చేయగలిగినవి.
కొన్నిటి కంతటివిజయము చేకూరలేదు. కాని అన్నిమత
ములలోను నిజతత్త్వమును గ్రహించిన బ్రహ్మజ్ఞానులు
లేకపోలేదు. అట్టితత్త్వజ్ఞ తేలించినపు డీమాయ యను
తెర యెంతదట్టముగానున్నను కొంతకాలము తొలగింప
బడును; అప్పుడు తెరచాటుననున్న తత్త్వ ముద్యోతక
మగును. మీ కొకయుదాహరణమును చూపుచున్నా
ను. ఇదిగో యిదియొక తెర! అనేక మడతలుగల యీ
జేబురుమాలును మీ కండ్లకడ్డముగా పెట్టుచున్నాను.
దీనిని మీరు త్రోసివేసి నన్ను చూడవచ్చును. కాని
యది మరల మీ కడ్డువచ్చుచుండును. ఇందులో నొక
మడతను తీసివేసెదను. తెర కొంచెము పలుచనగును.
మరికొన్ని మడతలను తగ్గించెదను. తెర మరింత పలుచ
నగును. ఇప్పుడుకూడ దీనిని తప్పించి చూడవచ్చును.

కాని యిది మరల తనస్థానము నాక్రమించుచుండును. తెర నంతకంతకు పలుచనచేసినచో దీనిని మీా రవతల కు తోఁచియకపోయినను నన్ను చూడవచ్చును. తెరయు న్నను లేనంతటి పలుచగా చేయబడినది. మన మొకరి నొకరము చూచుకొనవచ్చును. ఇప్పుడుకూడ దీనిని తోఁసిపుచ్చవచ్చును. తెర చాల పలుచగానుండి చూ చుట కెట్టియభ్యంతరమును కల్పింపనప్పు డది తెరయే కాజాలదు ! అదియున్నను మనము బ్రహ్మానందము నను భవింతుము ; మనము భగవంతుని ముఖాముఖిగా చూ తుము. మనమే భగవంతుడగుదుము. అప్పు డీప్రపంచ మం దేదియుకూడ మనయఖండసచ్చిదానందమున కడ్డు రాజాలదు ; దానిని భంగ మొనర్పజాలదు. అజ్ఞానమను తెరను (మాయను) అతిపలుచనచేసి, లేనిదానివలెనే చేసి, తదితరమతము లేవియు సాధింపజాలనట్లు దీనిని సాధించుటలోనే హిందూవేదాంతముయొక్క గొప్పతన

మంతయు కలదు. కర్మరంగమున మునిగియున్నను జ్ఞాని నిది బ్రహ్మానందమున నోలలాడింపగలదు. ఆపరాత్పరుని, మనన, ధ్యాన, కీర్తనాదులలో సంయోగ మున్నంత కాలమే మతమును చెందినవారైన నీ యజ్ఞానమను తెరను లేకుండచేసికొనగలుగుచున్నారు. హిందూ వేదాంతి కూడ నిట్టే బ్రహ్మానందమగ్నుఁడగుచున్నాఁడు. కాని యతఁడట్టిసమాధ్యవస్థలలోనే గాక దట్టమైన మాయ తెరలను కల్పించు మతముల కసాధ్యమగు నిత్యకర్మకలాపమందుఁగూడ దివ్యదృష్టినే యనుభవింపగలుగుచున్నాఁడు.

ఈప్రపంచములోనున్న మతము లన్నిటిని మనము మూఁడుతరగతులుగా విభజింపవచ్చును. ఏమతమైనను యీతరగతులలో నొకతరగతికి వచ్చితీరవలెను. 'తస్యైవాహం,' 'తవైవాహం' 'త్వమేవాహం.' నే నాపరాత్పరునివాఁడనే! నే నతనివాఁడనే! అనునది

మొదటితరగతికి చెందుచున్నది. ఈమతములో తెర చాల దట్టముగానున్నది. 'తవైవాహం' నేను నీవాడనే! అనునది రెండవతరగతిలోని మతము. ఈ రెండుతరగతులకును చెందు మతములలోను, సిద్ధాంతములలోను యున్న భేదమును చూచితిరా! మొదటితరగతి మతములోని భక్తుడు భగవంతుడు తనకు దూరముగానున్నట్లును, యెక్కడో యున్నట్లును, సమీపమున లేనట్లును, తనకు కాన్పించుచుండనట్లును భావించును; కనుకనే యతడు నే నతనివాడనే యను యుత్తమపురుషను (ఎదరలేని వానిని తెలుపునది) ప్రయోగించుచున్నాడు. ఇదియే మతమునకు ప్రథమావస్థ; ఇది మతాభినివేశతత్పరులగు మతశిశువులకు మాతృస్తన్యమువంటిది. మొట్టమొదట నిట్టి మాతృస్తన్యము నాస్వాదింపని యేమానవుడును మతములో నభివృద్ధిని గాంచజాలడు.

"నే నతనివాడనే!" ఆహా దీనినైనను సంపూ

ర్ణముగా గ్రహించిన మానవున కిది యమృతప్రాయము
కాదా ! అతడు ప్రాతఃకాలమున లేచి " ఆ పరాత్ప
రుడు నన్ను సుప్రోత్థితుని గావించినాడు ; " అతడు తన
యుద్యోగధర్మ నిర్వహణమునకు గడంగుచు " ఆ పరా
త్పరుని యాజ్ఞల నేను శిరసావహించుచున్నాను. ఈవి
శ్వమునంతను పాలించున దతడే ! ఈ విశ్వమంతయు
నతనిదే ! నాగృహము, నాబంధువులు, నాస్నేహితులు
నా సర్వస్వమును అతనివే ! అవి నాకతనివలననే ప్రసా
దింపబడినవి. జగత్తంతయు నతని మయమే ! " అనుచు
తన ప్రపంచకేళిని నీరపంకజన్యాయముగా నిర్వహించు
చు నీభూతలమును స్వర్గతలముగా మార్చివేయుట లేదా!
అతనికి సంపూర్ణవిశ్వాసము, భక్తిశ్రద్ధయుండి తన సర్వ
స్వమును, జగత్తంతయును, తానునుకూడ నా పరమే
శ్వరునివారమే యని హృదయాంతరాళము నుండియు
గ్రహింపగలిగి యట్లనుభవింపగలిగినచో నీభావమే

యఖండానిర్వాచ్యసచ్చిదానందమును చేకూర్చును. దీని ని గ్రహించి యనుభవింపగలిగినపు డిది యమృతఘుటి కయే యగును. కాని సిద్ధాంతములలో నిది మొట్టమొదటిది మాత్రమే యగుచున్నది. 'త్వమేవాహం.'

'నేను నీవాడనే' యను రెండవ సిద్ధాంతమును దీనితో పోల్చి చూడుడు! మొదటి దతి మధురముగా నున్నది. కాని యిది యంతకంటెను మధురముగా నున్నది. మొదటిది చెరకురసము; ఇది కేవలము బెల్లమే! ఈ భేదము మాకు కాన్పించుచునే యున్నది. దట్టముగానున్న తెర మరింత పలుచన చేయబడినది. 'నేను నీవాడనే' అనుదానిలో మనము భగవంతుని యెక్కడో యున్నవానివలె చూచుట లేదు; దగ్గర లేనివానివలె, తెరచాటున దూరముగా నున్నవానివలె యుత్తమపురుషనా ప్రయోగించుట లేదు! అతడు మన కెదురుపడినాడు. మనకు ముఖాముఖి సంభాషణ జరుగుచు

న్నది. అతడు మనకు చాలసమీపమునకు వచ్చినాడు ; మనచెంతనే, అంతకంతకు సమీపించుచు చూపులో చూపు కలుపుచున్నాడు ! ఇది మొదటి సిద్ధాంతముక న్న గొప్పది. కాని యిందులో గొప్పప్రమాదముకలదు. చాలమం దీసిద్ధాంతమును విశ్వసించి, భగవంతుని సమీపించినట్లు భావించుచుందురు ; కాని వారి కాయ దార్థతత్పరత, యఖండమైన యాత్మవిశ్వాసము కొరవ డియుండును. పూర్ణమైన విశ్వాసముండి మొదటియవస్థ లో నున్నను మధ్యనున్న తెర యెంతదట్టముగానున్నను నది తొలిసివేయబడుచున్నది. "నే నతనివాడనే" యను భావము హృదయాంతరాళమునుండి పొంగిపొరలుచు ప్రతిరోమకూపమును, ప్రతిరక్తబిందువును, ప్రతినాళ ము నాపాదమస్తకము నీ యనన్యభక్తితో, నీ యసా మాన్య విశ్వాస తత్పరతలతో ప్రతిధ్వనించు నెడల మాయ మాయమయి తన్ను తానే మరచిపోయి యా

భగవంతునిలో, నీ విశ్వములో లీనమగును. అతడు దివ్యుడగును ; భగవంతుడే యగును. కాని యొకానొకప్పుడు 'నేను నీవాడనే' యను రెండవ సిద్ధాంతములో విశ్వాసముగలవాడాపరిపూర్ణవిశ్వాసము లేకపోవుటచే సిద్ధాంతము గొప్పదైనను యీ భగవద్దర్శనానందాబ్ధి నోలలాడజాలడు. కాని యాతృష్ణను, ఆ తత్పరతను, ఆపరవశతను యీ రెండవ సిద్ధాంతముతో కూడ జేర్చుకొని యభివృద్ధి నొందవలెను.

"నేనే నీవు" అనునది మూడవ సిద్ధాంతము. చూచితిరా ! మనమిచ్చట యెంతసమీపమునకు వచ్చితిమి ! 'నే నతనివాడనే' అన్నదానిలో భగవంతుడు దగ్గర లేడు ; దూరముగా నెచ్చటనో యున్నాడు. 'నేను నీవాడనే' యన్నచోట ముఖాముఖిగా వచ్చితిమి ; సమీపమునకు చేరుకొంటిమి. ఈ మూడవస్థితిలో యిద్దరును కలుసుకొనుచున్నాము. ఒకరిలో నొకరు లీన

మగుచు నొకటి యగుచున్నాము. ప్రియు లిద్దరును ప్రేమ లో లీనమయిరి. రాధాకృష్ణు లేకమయిరి. వేదాంతము సాధింపబడినది ; గ్రహింపబడినది. దీపపుపురుగు దీప మును చేరి, చేరి దీపములోపడి దీపమయిపోవుచున్నది. ఉపనిషత్తు (వేదాంతము) అనగా జ్యోతులకెల్ల జ్యోతి యైన యా పరంజ్యోతియొక్క (ఉప) సమీపమును చేరి చేరి (ని) భిన్నత్వము, ద్వైతము అను భేదబుద్ధిని (షత్) నాశనముచేయుట. అనన్యమైన భగవద్భక్తు డతని లో నైక్యమయి యప్రయత్నముగనే, యనైచ్ఛికము గనే "నేను అతనే" "నేను అతనే" "నేను అతనే" "నేను నీవే" "మనయిద్దరము ఒకటే" "నేను భగ వంతుడను" "నేను భగవంతుడను" అను నిరంతర భగవద్ధ్యానలోలుడగుచుండును. ఇదియే మతముయొక్క పరమావధి ; ఇదియే పరమభక్తి ; ఇదియే వేదాంతము (అనగా జ్ఞానపరిసమాప్తి). ఇక్కడ గమ్యస్థానమును

చేరుచున్నాము ; ఈ సిద్ధాంతములోకూడ నజ్ఞానమను తెరయున్నను లేనంతటి పలుచన చేయబడినది ; కాని కొంద రాత్మవిశ్వాసము, అనన్యభక్తి, ఏకాగ్రిత లేనివారై తెరను పూర్తిగా తొలగింపలేక పరిపూర్ణబ్రహ్మానందసౌఖ్యమును బడయజాలరు. కొంద రీవిశ్వాసమును తొలుత బుద్ధిచే గ్రహించి మెల్లమెల్లగా భావపరిపూరితులై నిత్యకర్మకలాపమున ననుభవమునకు తెచ్చుకొనుచు బ్రహ్మానందము ననుభవింతురు. బ్రహ్మమే యగుదురు. వీరే జీవన్ముక్తులు. ముఖ్యముగా బుద్ధిచేతనే అజ్ఞానమను తెర యంతకంతకు సంస్కరింపబడుచుండును ; అది హృదయసంతాపముచే పూర్తిగా తొలగింపబడును.

ఈ మూడువిధములైన యవస్థలను మనమిప్పుడు చూచియున్నాము. ఆయాస్థితులలో నున్నవారెట్లు మధ్యమధ్య నడ్డుతగులుచుండు నజ్ఞానమను తెరను తొల

గింపగలరో నిదర్శనపూర్వకముగా చూచెదము.

ఒకకన్య తన ప్రియుని యేకాంతయు ప్రేమించ నంత యనన్యభక్తితో ప్రేమించుచుండెను; ఆమె శరీర మంతయు ప్రేమమయ మయ్యెను. ప్రతిరక్తబిందువు, ప్రతిస్వేదకూపము, ప్రతిరక్తనాళము "ప్రియుడు" "ప్రియుడు" అని తపించుచుండెను. ఒకప్పు డామెకు గొప్ప వ్యాధివచ్చుటచే ననేకమంది ఘనవైద్యులు వచ్చి చికిత్సకు సాధనముల నారయుచుండిరి. చివర కామె శరీరమునుండి కొంత రక్తమును తీసివేసిన గాని వ్యాధికుదురదని నిర్ధారణ చేయబడెను. వెంటనే సూదు లామె శరీరములోని కెక్కించబడెను; కాని యీమె శరీరమునుండి యొక్క రక్తపుచుక్కైనను రాకుండెను; కాని అదేమి చిత్రమో! ఆసమయముననే యీమె ప్రియుని శరీరమునుండి రక్తము ప్రవహింప జొచ్చెను. ఆహా! ఎంతయద్భుతమైన యైక్యత! ఇదియొక గాథమాత్రమే

యని మీరనవచ్చును. ఇది సత్యమే కానచ్చును. గాఢా నురాగబద్ధులైన వారింతటి యవస్థకు రాకపోయినను తమ జీవితములలో నిటువంటి యనుభవములు కలవారు లేకపోలేదు. ఆకన్య తన శరీరమునే మరచిపోయి తన భర్తశరీరమునే తన శరీరముగా చేసికొనెను; ప్రియుడు తన ప్రియురాలి ప్రేమలో లీనమైపోయెను. రెండు శరీరములును ఏకమైపోయెను.

భగవంతునిలో పొందు నిట్టి యైక్యతకే మతము నిపేరు. నాశరీరమతని శరీరము కావలెను; అతని యాత్మ నాయాత్మ కావలెను. మతము సిద్ధించవలెను.

యోగవాసిష్టములో నొకకథ కలదు. ఒక ప్రియురాలగ్నిహోత్రములో త్రోయబడెను. కాని యగ్నిహోత్రి మామెను దహింపదాయెను; ఆమె ప్రియుడుకూడ నగ్నిహోత్రమున బడవేయబడెను. కాని అతని శరీరముకూడ యథాప్రకారముగనే యుండెను. అగ్ని

హోత్రియము వా రిరువురను దహింపజాలక పోయెను. వారు గంగాతోయములలో ద్రోయబడిరి. ఆతల్లికూడ వారిని ముంచివేయక పోయెను. వారిని పర్వతాగ్రము లనుండి క్రిందకు త్రోసివేసిరి. కాని ఒక్క యెముకైనను విరుగలేదు. ఎంత చిత్రము! దీనికి కారణమేమి? అప్పుడు వారు దాని కీసమాధానమును చెప్పజాలకుండిరి. వారు తమ్ము తాము మరచి పోయిరి. తరువాత వారిని ప్రశ్నింపగ వారొకరి కొకరు విశ్వతుల్యురనియు, విశ్వమే యనియు, విశ్వమంతయు నొకరిలో నొకరు చూడ గలిగితి మనియు చెప్పిరి. వారికి నిప్పు నిప్పు కాదు. నిప్పు ప్రియునకు ప్రియురాలి వలెను ప్రియురాలికి ప్రియునివలెను కాన్పించెను. నీరు నీరు కాదు; రాళ్లు రాళ్లు కావు; శరీరము శరీరము కాదు; సర్వత్ర ప్రియుడు ప్రియురాలు ద్యోతకమగుచుండెను. ఇక వారి కపకారమును కలిగించు వా రెవరు? ప్రియులు తమలో

[illegible] చేసికొను టెట్లు సంభవించును?

ప్రహ్లాద చరిత్రను మన మెరుంగమే! "పానీయంబులు త్రావుచున్, కుడుచుచుని భాషించుచున్ హాస లీలా నిద్రాదులు సలుపుచున్........" అని సర్వత్ర విష్ణుమయమునే చూడగలిగిన ప్రహ్లాదుని యగ్నిజ్వాలలు దహింపగలిగెనా? నీరు మ్రింగివేసెనా? అతనికి నిప్పు నీరు మొదలగు పంచభూతములును కూడ యెట్టి యపకారమును చేయలేదు. వాటియథార్థతత్త్వము గ్రహింపబడెను. ఆ బాలుడు తన నిజతత్త్వమునకు రాగలిగెను. అతనికి "సర్వం ఖల్విదం బ్రహ్మ" అంతయు ప్రేమమయే! పొడుచుట, దూషించుట, భయపెట్టుట, అగ్నిహోత్రములు, కత్తులు, పర్వతములు మొదలగునవన్నియు స్వర్గము తప్ప మరేవియు కాజాలవయ్యెను! ఇక నతని కపచారము చేయునదేది కలదు?

హిమాలయ పర్వతారణ్యములలో నొకఋషి

గంగయొడ్డున కూర్చొని తపము నొనర్చుచుండెను. అవ తలియొడ్డున కొందరు మునులు 'శివోహం' 'శివోహం' 'శివోహం' అని ధ్యానము చేయుచున్న యాఋషిని చూచుచుండిరి. 'శివోహం' అనగా నేను భగవంతుడను అని యర్థము. ఇంతలో నెక్కడ నుండియో యొకపులి వచ్చెను. అది యాఋషిపై నుఱికి యతనిని నోటకరచు కొనెను. కాని యతడు యథాప్రకారముగ నే 'శివోహం' 'శివోహం' అను మంత్రమును నిశ్చింతగా జపించుచుం డెను. ఆపులి యతని కాళ్లను, చేతులను చీల్చివేయు చుండెను; అప్పటికి నతడట్టే యనన్యచింతతో జపించు చుండెను. ఆహా! ఏమి యాశ్చర్యము! ఈప్రపంచము న నతని కన్యమైన దేదియును లేదు; సర్వమును బ్ర హ్మమే! సర్వమును తానే! ఇది శూన్యవాదము కాదు; ఇదియే పరమావధి; ఇదియే పరిపూర్ణజ్ఞానము; ఇదియే మతము. ప్రియు లిట్టి యనన్యప్రేమతరంగములం దోల

లుండునపు డొకరిలో నొకరు లీనమగుట లేదా ? స్త్రీ తన చిన్నిబిడ్డను ముద్దిడుచు తానే యిక్కడ ప్రతిబింబించుచున్న ట్లానందించుటలేదా ? తన రక్తమే తన మాంసమే, తన యస్తులే రెండవ తానైన ట్లనుభవించుట లేదా ? ఆమాతాశిశువుల ప్రయోజనము లేకమైపోయినవి; అవి రెండుకాదు; ఒకటే. ఆపరాత్పరుని చేబట్టుచు, నాశ్లేషించుచు, బరిణాయమగుచు ననన్య చింతాక్రాంతుడవై యతనిలో లీనమై, యేకమై, ద్వైతమునకు తావులేకుండ చేసికొనుము. "ఓభగవానుడా ! భవదధీనుడను ! నీసంకల్పము నెరవేరునుగాక !" అనుటకంటె "నాసంకల్పమే నెరవేరుచున్నది" అను పరమానందమును పొందుము !

ఒక గోపిక కృష్ణునియం దతిగాఢానురాగబద్ధయైయుండెను. ఒకనాటి సాయంకాలమామె దీపమును వెలిగించి తెచ్చెదనను వ్యాజముచెప్పి యాలీలామాను

ష విగ్రిహమును తనివితీర చూచుటకు కృష్ణునింటకు బోయెను. ఆమె కృష్ణునింట వెలుగుచున్న ప్రిమిదెకు తన చేతిలోనున్న ప్రిమిదెను జేర్చెను; వెలుగుచున్న వత్తి తన ప్రిమిదెంలో నున్న వత్తి నంటించవలెను. కాని యామె యాశిఖిపింఛపతాళిని, మూనురళీ మనోహరుని, యాస్త్రీహృదయ నవనీతచోరుని రెప్పవాల్పక చూచుచుండెను. ఆమె తన్ను తాను మరచిపోయెను. చేతనున్న వత్తి వెలుగుటకు మారుగా నామె చేయియే యంటుకొనెను. వేళ్లు కాలిపోవుచుండెను; కాని యామె కదేది యును తెలియనే తెలియదు. ఆమె నేత్రికమలములు కృష్ణవిగ్రిహముపై లగ్నమయ్యెను. ఆమె యెంతసేపటి కిని యింటికి రాకుండుటచే నామె తల్లి యామెకొరకు వెదకికొనుచు కృష్ణునింటకు వచ్చెను. ఆమె వచ్చుసరికి కుమార్తె వ్రేళ్ళులంటుకొనిపోవుచుండెను; ఆకన్యకుమా త్రి మాసగంతి తెలియనే తెలియదు; అదిచూచి తల్లి

గుండెలు బాదుకొనుచు, రోదనచేయుచు బిగ్గరగా నేడ్వ సాగెను. అప్పు డా పిల్లకు తెలివివచ్చెను. ఇట్టి గాఢానురాగములోనే, యిట్టి దివ్యప్రేమలోనే ప్రియు లిద్దరు సాంద్రారులలో లీనమగుదురు. "వాడే నేను" "నీవే నేను" ఇదియే మూడవయవస్థ; దీని తరువాత యవస్థలో నీశబ్దజాలముకుకూడ తావు లేదు. అంతావమానమే! ఈకథలన్నియు మతాభివృద్ధియొక్క మూడవ యవస్థను తెలియజేయును. "నేను నీవాడను" "నేను నీవాడను" అను రెండవయవస్థకుకూడ కొన్ని యుదాహరణములను చూపెదను.

ఇద్దరువిద్యార్థు లొక గురువును చేరి తమకు మోక్షని వేశమును కలిగింపవలెనని వేడుకొనిరి. వారిని గురుడు పరీక్షించిన గాని మతబోధ చేయజాలనని యా గురుస్వామి గురుడు చెరియొక పావురమునిచ్చి మీరు యెవ్వరును చూడకుండ వీటిని చంపి తెండని

యాజ్ఞాపించెను. ఒక విద్యార్థి వెంటనే యొకరాజవీధిలో నికి బోయి, జనము కిటకిట లాడుచు బోవుచుండ నొక్క ప్రక్కకు పోయి నెత్తిపై నొకబట్ట కప్పుకొని, పావురమును తీసి మెడనులిమి చంపివేసి గురువుగారి వద్దకు పరుగెత్తి "స్వామీ! స్వామీ! యిదుగో! మీయాజ్ఞను నెరవేర్చినాడను" అని చెప్పెను. "నిన్నెవరును చూడకుండగనే నీ వాపనిని చేసితివా?" అని యడుగ నావిద్యార్థి "అవును" "అట్లే చేసితిని" అనెను. "సరే! నీహోసధ్యాయు డేమిచేసెనో చూడవలెను." అని గురువుచెప్పెను.

రెండవవిద్యార్థియొకసాంద్రతరనిర్జనారణ్యమధ్యమునకుపోయి యిటునటు జూచి ప్రపంచమంతయు నిశ్శబ్దముగా నుండుటను గాంచి చీమ కాలిడుటకైనను వీలుగానిచోట నాపావురమును చంపవలెనని పైకి తీసెను. అతడు దానిమెడను నులుముటకు యత్నించెను! కాని

యాపావురముయొక్క నేత్రకమలములనుండి యెవరో తొంగిచూచుచుండుట నతడు గాంచి దానిని చంపుటకు భయభ్రాంతుడయ్యెను. గురువుగారుకోరినషరతు చాల కష్టమైనదనియు, నసాధ్యమనియు నతనికిప్పుడు తట్టెను! అతని కాపావురము కండ్లలోకూడ సాక్షియున్నట్లు, చూచువాడున్నట్లు గోచరమయ్యెను. "అయ్యో! నేనొంటరిగా లేనే! నేనిచ్చటనున్నను నన్నెవరును చూడజాలని స్థలమున లేనే! నన్నిచ్చటకూడ చూచుచున్నవాడు కలడు! నేనేమి చేతును? ఎచ్చటనుబోదును?" అతడిట్లనుకొని పోయిపోయి మరియొక కీకారణ్యమును జేరుకొనెను. అక్కడకూడ నతడాపావురమును జంపయత్నింపగా నానేత్రద్వయ మతనిని చూచుచుండెను. ఆపావురములోనే సాక్షియుండెను. అతడెన్నిసారులు ప్రయత్నించినను లాభములేకపోయెను. ఎందుబోయినను నిష్ఫలమయ్యెను. గురువుగారి షరతును చెల్లించుట సాధ్యము

కాకపోయెను. విఫలమనోరథుడై, హృదయసంతాపభర మున క్రృంగి యతడు గురువును జేరి పాపురమును వానికి సమర్పించుచు స్వామీ ! స్వామీ ! నేను మీాపరతును చెల్లింపజాలను ! నాకు బ్రహ్మజ్ఞానమును ప్రసాదింప వేడుకొనుచున్నాను. ఈపరీక్ష నాకు దుస్సాధ్యము; నేను దీనికి తాళజాలను. నాయెడ దయామయుడవై యాదివ్య జ్ఞానమును ప్రసాదింప వేడుకొనుచున్నాను. నేనుదీనికొరకు పరితపించుచున్నాను." అని చెప్పెను. అప్పుడాగురువు వానిని ఓదార్చికొని, లాలించి, విచారము నుపశమింప జేసి యిట్లుహితబోధచేసెను. "కుమారా ! నీ వాపక్షి కన్నులలోనున్న సాక్షిని చూడగలిగినట్లె నీవెచ్చటనున్నను, మోహావేశముచే నీవేయకృత్యమును చేయనున్నను అపరాత్పరుని, ఆదివ్యసాక్షిని జ్ఞాపకమునకు తెచ్చికొనుము; అతడు లేనిస్థలమే లేదు. నీవాసించు స్త్రీలోనున్న దివ్యసాక్షిని గుర్తించుము. ఆమెకళ్ళలోనుండికూడ నీ

గురువు నిన్ను చూచుచుండుటను గ్రహింపుము. ఆపరా
త్పరుడు, నీగురుశ్రేష్ఠుడు, నిన్నెప్పుడును చూచుచు
న్నాడు; నీవెప్పుడు నాతనిసమక్షముననున్నట్లె ప్రవర్తిం
పవలెను; అతడు నీకు ముఖాముఖిగనే యున్నాడు.
నీవెప్పుడు నతనిదృష్టిలోనే యున్నావు."

నేపిల్సుపట్టణములో బ్రహ్మాండమైన చిత్రప్రద
ర్శనశాలకలదు; ఆసౌధాగ్రమున నొక సుందరమైన
దివ్యవదనాంభోజ మమర్చబడెను; ఆప్రదర్శనశాలలో
మన మెచ్చటనున్నను, అడుగుభాగముననున్నను, పైకె
క్కినను, యేమూలకుపోయిచూచుచున్నను మనల నా
పవిత్రదివ్యనేత్రములు చూచుచునేయుండును. ఈరెం
డవయాధ్యాత్మికావస్థలోనున్నవారు తమకు తాము
ద్రోహులుకాకుండ నుండుచో నెల్లపుడు నాపరాత్పరు
నిదృష్టిలో నుందురు; పర్వతగుహాలలో దాగినను, అం
తఃపురములలో నున్నను ము గనిర్జనారణ్యసీమలలో ను

న్నను వానిచే చూడబడుచు, పోషింపబడుచు, నభి
వృద్ధిగాంచుచుందురు.

"నేనతనివాడను" "నేనతనివాడను" అనునది
మొట్టమొదటి యాధ్యాత్మికస్థితియని చెప్పియున్నాము.
ఇది చాల ప్రాథమికస్థితిగా కాన్పించును. కాని యీ
యాధ్యాత్మికాభివృద్ధికూడ చులకనగా నలవడునదికా
దు. దీనిని గ్రహించుటంతకష్టమోకదా! దీనిని గ్ర
హించి పరిపూర్ణభక్తి, విశ్వాసము లుంచి, యేకాగ్రత
తో నీవిశ్వాసము నాచరణకు తెచ్చుచు ప్రతిరక్తబిం
దువు, శరీరము తయు, నాపాదమస్తకము నీభావముతో
నే ప్రతిధ్వనించునెడల నీప్రపంచములో నే యట్టివాడు
జీవన్ముక్తుడగుచున్నాడు! బ్రహ్మమగుచున్నాడు!

ఒకమహర్షి తన చిన్నతనములో ధన, ధాన్య
ములను, యాహారమును బీదలకు పంచిపెట్టుటకు ని
యోగింపబడును. ఆతనివద్ద కనేక బిచ్చగాండ్రు వచ్చు

చుండిరి. అతడు వారందరకును పదమూడు తవ్వలచొ ప్పున పిండి కొలిచి యివ్వవలెనని యాజ్ఞాపింపబడెను. ఆతడు ఒకటి, రెండు, మూడు నాలుగు అని బిగ్గరగా లెక్కపెట్టుచు వారి కిచ్చుచుండెను. ఇట్లు పండ్రెండు వరకు లెక్కించియిచ్చెను. పదుమూడవది యివ్వవలసి వచ్చెను. పదమూడును హిందూస్తానీభాషలో "తేరా" అని పిలుతురు. "తేరా"కు మరియొక అర్థముకూడ కలదు. పదమూడు ఒకయర్థము; రెండవది నేనునీవాడను." "నేను నీవాడను" నేనా పరాత్పరుని వాడను; నేనతని యంశమును; అతనివాడను." అతడు పండ్రెండు లెక్కిం చి యీ పదమూడవదానిని కొలిచి "తేరా" "తేరా" అని యనుచుండ నాధ్యాత్మికతరంగము లుప్పొంగి తన శరీరమునే యాపరాత్పరుని కర్పించెను. అతడు తన్ను తాను మరచిపోయెను; అత డీప్రపంచమునే విస్మరించె ను. అతడు తన నిజతత్త్వమును గ్రహించెను. ఇట్టి తన్మ

యత్నములో సతము 'తేరా' 'తేరా' 'తేరా' 'తేరా' యని లెక్కించుచును బ్రహ్మానందపరవశుడై పడిపోవువరకు నటించుచునే యుందురు. చూచితిరా! ప్రథమదశావస్థలో నున్నవారుకూడ నిజతత్త్వమును గ్రహించుచో నట్టియుత్కృష్టమస్థితికైనను పోగలరు. విశ్వాసము; భక్తి; శ్రద్ధ; యివియే చాలప్రాముఖ్యములు. ఆపరాత్పరుని వంచనచేయుటను చూడరాదు; ఈశ్వరార్పణమైనదానిని మరల స్వార్థపరత్వముచే స్వీకరింపరాదు. మాటలకును, చేతలకును నడుమనుండరాదు. ఒకసారి "నేను నీవాడను" అని దేవాలయములో కాని మరెచ్చటనుకాని మన ముచ్చరింతుమేని మన మాసౌఖ్యము ననుభవింపవలెను; ఆభావము పూర్తిగా హృదయములో పల్లవించి ఫలపుష్పసమన్వితము కావలెను. ఇదియే మతము.

ఈప్రపంచములోని మతములన్నియు "తస్యైవాహం" "తవైవాహం" "త్వమేవాహం" అను మూడు

తరగతులక్రిందను చేరునని యిదివరకే తెలిసికొంటిమి. సిద్ధాంతములలోనివి మొదటిదానికన్న రెండవది; రెండవదానికన్న మూడవది మిన్నయగుచున్నవి. కాని యీ మూడుసిద్ధాంతములలోనుకూడ మనము యదార్థమైన యాధ్యాత్మికతత్వము ననుభవింపవచ్చును.

భారతీయుల విశ్వాసముప్రకారము మొదటితరగతిలోనుండి యదార్థమైన యాధ్యాత్మికానుభవముకలవారీజన్మలోనో లేక మరియొకజన్మలోనో తరువాతమెట్టుకు వత్తురు. మరల యీరెండవమెట్టులో యదార్థమైన యాధ్యాత్మికానుభవమున్నచో నీజన్మమునో లేక మరియొకజన్మలోనో మూడవయవస్థకు మెల్లమెల్లగా జేరుకొనును. "నేనే నీవు. నీవే నేను" "నేనే బ్రహ్మము. బ్రహ్మమే నేను" ఈస్థితికి వచ్చుటతోడనే యికజన్మయుండదు. అతనికిక మోక్షమే! మోక్షమే! మోక్షమే! మానవుడప్పుడు భగవంతుడే! భగవంతుడే! ఇదియే యతని పరమావధి! ఓం! ఓం! ఓం!

## సత్యపథము.

సత్యపథమనగా సత్యముయొక్క మార్గము; సత్యముకు మార్గము అని భావము; కాని యీశీర్షిక కర్థమే లేదు; ఇట్టి నామకరణము పొరపాటు. సత్యము దూరము అనునవి విరుద్ధపదములు; సత్యము దూరములో లేనప్పుడు దానికి మార్గమనుటలో నర్థమేమున్నది? సత్యము నీలోనే యున్నది; నీయాత్మలోనే యున్నది. నీవు సత్యములోనే యున్నావు; నీవేసత్యము! సత్యముకు మార్గమని ప్రయోగించు టెంత వెర్రితనము! నీవు నీబ్రహ్మత్వమును, నీదివ్యత్వమును గ్రహించుట యనునదొక పనికాదు; ఇందు నూతనముగా సాధింపబడవలసిన దేదియును లేదు. నూతనముగా సృష్టింపవలసిన దేదియును లేదు! అది యిదివరకే సాధింపబడినది! "తత్త్వమసి" నీవిదివరకే బ్రహ్మముకాని నీచుట్టును నీవల్లుకొనివచ్చిన కామపాశములను మాత్రము నీవిప్పుడు త్రెంచుకో

నవలసి యున్నది. ఇట్లు నీవు తెచ్చిపెట్టుకొనినవాటిని పారద్రోలుట తప్ప నీవు క్రొత్తగా కృషిచేసి సంపాదించుకొనవలసిన దేదియును లేదు! స్వయంకృతమును మరచిపోమ్మా! కాని మన పాశములను మనము త్రెంచుకొనుట చాలమంది కసాధ్యముగనే యుండును. మన రాగద్వేషములు, కామక్రోధములు, మదమాత్సర్యములు మొదలగునవే మన శత్రువులు; మన సంకెలలు; మనమేర్పరచుకొన్న బంధనములు; ఉరిత్రాడులు. ఇవి మి మ్మాపరాత్పరుని చూడలేకుండ చేయుచున్నవి.. ఈ బంధిఖానానుండి మీరు బయటబడవలెను. మీరొక్కేసారి యిద్దరుప్రభువుల నెట్లు కొలువగలరు? భాగ్యదేవతను భగవంతుని యొకేసారి యారాధించుట శక్యము కాదు. ఒకవంక కామక్రోధములకు బానిసలగుచు నొకవంక విశ్వమంతకును ప్రభువగుట యెట్లు సాధ్యముకాగలదు? సత్యమును తెలిసికొనుటయనగా నీవిశ్వమున

కంతకును పరిభవగుటయే! కామాంధులను కలిగియుం
డుట బంధనములను, దాస్యమును, ఐహికశృంఖలములను,
విషయపాశములను శిరసావహించుట కాదా! ప్రతివాని
కిని సత్యమును గ్రహించవలెననియే యుండును; ప్రతి
వాడును బుద్ధుడు కావలెనని కోరును; కాని దానికి పడ
వలసిన శ్రమను, చెల్లించవలసిన మూల్యమును చెల్లిం
చుట కొక్కడును సిద్ధపడడు! భారతదేశములో నొక
గొప్పవస్తాదుండెను. అతడొక క్షురకునివద్దకు బోయి
తనచేతిపై నొక గొప్ప సింహవిగ్రహమును పచ్చ
బొట్టుతో చిత్రింపుమని యాజ్ఞాపించెను. ఆ వస్తాదు
సింహలగ్నమందు పుట్టెనట. సింహలగ్నమందు
పుట్టుటచే నవక్రిపరాక్రమశాలి యగునని జ్యోతిష
ము కలదట! పుట్టుకలోనే సింహమై పుట్టెను కనుక
సింహచిహ్నమును చేతిపైనుంచుకొనవలెనని యతడు
కోరెను. మంగలి సూదెతీసుకొని పొడువనారంభించె

ను. సూదెతగులుటతోడనే యతడు గోలపెట్ట నారంభించెను. "వద్దు! వద్దు! ఆగుము! ఆగుము! నీవేమి చేయబోవుచున్నావు?" అని యాపురుషసింహము మంగలి నడిగెను. "నేను సింహముయొక్కతోకను చిత్రించుచున్నాను." అని యతడు చెప్పెను. "ఓరి! వెర్రివాడా! నవనాగరికులీరోజులలో తమ గుఱ్ఱములు, కుక్కలు మొదలగువాటితోకలను కోసివేయుచుండుటను నీవెరుగవా? తోకలేనిసింహమే చాల భయంకరముగాను గంభీరముగాను యుండును. కనుక తోకయక్కరలేకుండ సింహమును చింత్రించుము." అని యావస్తాదు చెప్పెను. మంగలి యట్లే చేసెదనిచెప్పి మరల పొడుచుచుండెను. అతడాబాధ సహింపలేక "ఆగు! ఆగు! ఏమిచేయుచున్నావు?" అని మరలనడుగగా "సింహముయొక్కచెవులను చిత్రించుచున్నాను." అని మంగలి బదులుచెప్పెను. "ఓరి మూర్ఖశిరోమణీ! నవనాగరికులు కుక్క

లకు చెవులను కోసి వేయుట నీవు చూడ లేదా? కుక్కలకు పొడుగు చెవు లుండనీయరు. చెవులు లేని సింహమే మంచి జవసత్వములను కలిగియుండును. కనుక చెవులక్కర లేదు." అట్లేయని మంగలి మరల పొడుచుచుండెను. ఈసారి కూడ నతడు మండిపడి "నీ వేమి చేయుచున్నావు?" అని గద్దించెను. "నేను సింహముయొక్క నడుమును చిత్రించుచున్నాను." అని యతడు బదులు చెప్పెను. "ఓ మూర్ఖుడా! నీవు మనకవులవర్ణనలు విన లేదా? సింహముయొక్క నడుము చాల చిన్నదిగా నుండును; లేనట్లేయుండును. ఇంకను నడుము నీకు తెలియదురా? అదికూడ ననవసరమే!" చివరకు మంగలికి ప్రాణము విసిగి రంగులను, సూదను పారవేసి లేచిపోయెను.

చూచితిరా! సింహరాశికి చెందినాననియు, వస్తాదుననియు సింహము నేననియు డంబములు కొట్టుచున్న యాతడు తన చేతిమీద సింహవిగ్రహమును పొడిపించు

కొంత నుత్సహించును గాని సూది తగులుటతోడనే బా
ధను సహింపలేక గంతులు వేయును! ఈప్రపంచములో
సాధారణముగా భగవంతుని చూడగోరువారిలో, వే
దాంతమును గ్రహింప ప్రయత్నించువారిలో, విశ్వము
నంతను సాధింపబూనువారిలో చాలమంది యిట్టివారై
యుందురు. ఇట్టివారీ ధర్మదేవత యనుసింహమును తమ
పై చిత్రింపవలసిన సమయమువచ్చినప్పుడు బాధకు
తాళజాలక పారిపోవుచుందురు. వారీ బాధకుమాత్ర
మొల్లరు. "నా కావస్తువు కావలెను. మూల్యము మాత్ర
ము నేను చెల్లింపను!" ఇదియే వీరితత్త్వము.

నీవు సత్యము నారయగోరుదువేని, బ్రహ్మజ్ఞా
నమును బడయగోరుదువేని నీలోనున్న రాగద్వేషములు,
కామక్రోధములు, సమస్తవాంఛలు మొదలగు వాటి
నన్నిటిని నీనుండి పూర్తిగా పెరికివేయవలెను. వాటిని
చీల్చివేసి నీదరికి రాకుండ చేయవలెను. పశుప్రాయ

మైన, అమానుషమైన, రాగాదులను పారద్రోలి నీవు పవిత్రుడవు కావలెను. పవిత్రత! పవిత్రత! ఇదియే నీమూలమంత్రము. ఏమియు చేయకుండ, తగిన మూల్యమును చెల్లింపకుండ నీవెట్లా పరాత్పరుని చేరగలవు? నీజన్మహక్కు నెట్లు తిరుగ సంపాదించు కొనగలవు? ఎవరి హృదయాబ్జము లతిపవిత్రములో వారే భగవంతుని చూడగలరు! వారే ధన్యాత్ములు! పవిత్రత లేక హృదయనైర్మల్యము అనగా నేమి? విషయసౌఖ్యములను విడిచిపెట్టుట మాత్రమే పవిత్రత కానేరదు. అది యింతకంటెను చాల మిన్నయైనది! ధన, కనక వస్తు వాహనముల యెడల గాని, పుత్రమిత్ర కళత్రాదుల యెడల గాని, అశ్వాదిమృగాదుల యెడల గాని మరే వస్తువుపట్ల గాని మనకుండు యనురాగమే పరిపూర్ణ సత్యమును గ్రహించుట కడ్డుతగులుచుండునని మీరెప్పటికైనను కనుగొనగలరు. అదికూడ వ్యభిచారమంతటి

సాహసమే యను సంగతిని మీరు గ్రహింపగలరు. ఈ ప్రపంచికవిషయములం దసంగియగుటయే పవిత్రత యనుదాని కర్థము. సన్యాసము ! వైరాగ్యము ! సంగరహితులే ధన్యాత్ములు! వారే భగవంతుని చూడగలరు !

అట్లాంటా యనునామె యొక సింహబలునితో పందెము వేసెను. ఆమె తనతో సమానముగా పరువెత్తువా డెచ్చటను లేడని ప్రఖ్యాతిగాంచెను. ఆమె యెంతటి బలశాలినైన నోడించి ప్రపంచవిఖ్యాతిని బడసెను. కాని యితడు తన యిష్టదేవతను ప్రార్థించి యట్లాంటాను జయించు మార్గమును తనకు తెలియజేయుమని వేడుకొనెను. ఆమె యతని కొక చక్కని సలహా నిచ్చెను. "అట్లాంటాతో పందెము వేసి మీరుపరువెత్తవలసినమార్గము పొడుగునను బంగారు యిటుకలను వెదచల్లుము" అని యామె సలహానిచ్చెను. అట్లాంటా నోడించుటకంత

కంటె వేరొకమార్గ మూ దేవతకుగూడ తోచలేదు. అత
డట్లు చేసి యూమెను తనతో పందెము వేయుమని సవాలు
చేసెను. వారిద్దరును పరుగెత్తనారంభించిరి. కాని యత
డామెకంటె చాలబలహీనుడగుటచే వెనుకబడిపోయెను.
ఒక్క నిమిషములో నామె యతనికంటికి కాన్పించ
కుండపోయెను. ఇంతలో నామెకు త్రోవలో బంగా
రుయిటుకలు కాన్పింప నారంభించెను. ఆమె వాటికొర
కాసపడి వాటినేరుకొనుచు వడిగట్టనారంభించెను. ఆమె
వాటి నేరుకొనుచుండ నాపురుషు డామెను కలుసుకొని
యూమెకంటె ముందరకూడ పోవుచుండెను. ఆమెయొ
క్కనిమిషములో తిరుగ వానిని త్రొక్కివేయుచు ముం
దుకు పోవుచుండెను. ఇంతలో నామె మార్గమున కిరు
వైపులను మరల బంగారుయిటుకలు కాన్పించుచుండెను.
ఆమె వాటినన్నిటిని యేరుకొనుచుండెను. మరల నాతడా
మెను కలుసుకొనుచుండెను. ఆమెమరల యతనినోడిం

ముచుండెను. ఇట్లుండ నామెకట్టిన బంగారు యిటుకల మూట బరువెత్తజొచ్చెను. ఈమూట మోసికొనుచు వాని నోడించుట దుష్కరమయ్యెను! చిట్టచివరకతడే విజయుడయ్యెను. ఆబంగారు యిటుకలన్నియు నతనివై పోయెను. అట్లాంటానుకూడ నతడు జయించుకొనెను. ఆమెయతనికి సమర్పింపబడెను. సర్వము నతనిహస్తగతమయ్యెను.

సత్యపథమునబోవువారిలో చాలమం దిట్టివారే యుందురు. మనమొకసారి ధర్మమార్గమునుబట్టి పోవునపుడు త్రోవలో మనకనేక యంతరాయములు గల్పింపబడును. విషయసౌఖ్యములు మనల నెదుర్కొనును. ప్రాపంచికపాశములు మనలను చుట్టవేయును. నీవు వాటినేగుకొనుట కొక్కసారి పాల్పడుదువేని, వెనుకంజవేతువేని యిక నీకు జయముకల్ల. నీవాలస్యముచేయుచు పందెమును పోగొట్టుకొనుచు, వెనుకబడి నీసమస్తము

నుకూడ నట్లుండవలెనే భోగోప్లుకొనుచు పాతభా
గ్యుడ వగుచున్నావు. నీమార్గము కంటకచ్ఛన్నమగుచు
న్నది. ప్రాపంచికపాశములకును, విషయసౌఖ్యముల
కును, చోటిచ్చుచో, మీకోటుము తథ్యము! తథ్యము!
మీరు పరిమితక సౌఖ్యములలో మునిగిననాడు ధర్మము
సత్యము, మీచేతులనుండి జారిపోవును. మీకది దొర
కనేరదు. రాముడు మీకు సత్యమునే యొసకపరచుచు
న్నాడు! మాకు బ్రహ్మజ్ఞానము కావలెను! బ్రహ్మజ్ఞాన
ము కావలెను. అని యనేకమంది రాముని వేధించు
చుందురు.

ఈశుణికమునే మీరకది ప్రాప్తించగలదు. సంగమును
విడుము; దానివిపారదోలుము. దానితో పాటు యీర్ష్యా,
ద్వేష, మాత్సర్యాదులనుగూడ పరిత్యజింపుము. ఈర్ష్యా,
ద్వేషము అననేమి? అవి తల్లకిందులుగానున్న సంగము
తప్ప మరేమియు కావు. మన మొకరిని ద్వేషించుటకు

కారణము మరియొకదానికి సంగులమగుటేతప్ప మరేమి యున్నది? అయితే మేము మాపుత్రులను, మాతాపితృలను, భార్యాభర్తలను విడనాడుకొను టెట్లు? అని మీరు ప్రశ్నింపవచ్చును. దానిని మీరే నిశ్చయించుకొనవలసియున్నది. మీ మీ మార్గములను, సాధనలను మీరే నిర్ణయించుకొనవలెను. సత్యము లేక భగవంతుడే మీతండ్రియగుగాక! సత్యమే తల్లియగుగాక! సత్యము లేక భగవంతుడే మీభార్య, పుత్రులు, గురువు, తాత, యిల్లు, వాకిలి, ధనధాన్యాదులు మొదలగునవన్నియును నీసర్వస్వమును యగునుగాక! ఈప్రపంచవస్తువు లన్నిటినుండియు, ప్రతిదానినుండియు నీబంధనములను, రాగద్వేషములను తెంచుకొని ఒక్కసత్యమునే ధ్యానము చేయుము! నీ దివ్యత్వమునే ధ్యానము చేయుము! ఇట్లు చేయుదువేని బ్రహ్మజ్ఞాన మొక్కత్రుటికాలములోనే యలవడగలదు.

మన దేశములో నొక సామెత గలదు. సత్యమును గ్రహించుటకు నీ వుత్సహించునపుడు నీ తండ్రియైనను నీ కాటంకములను కల్పించుచో వాని నతిక్రమించి ప్రహ్లాదకుమారునివలెనే ప్రవర్తించుము. నీ సోదరుడు నీ కడ్డుతగులు నేని విభీషణునివలెనే వానిని త్యజింపుము; నీ భార్యయైనను భర్తృహరివలె విడిచిపెట్టుము. నీభర్త నీ దివ్యజ్ఞానమున కడ్డువచ్చునేని మీరానువలెనే వానిని లెక్కగొనకుము ; నీ గురువే నీ కభ్యంతరమైనను భీష్మునివలెనే నీవు వానినిగూడ విడనాడుము. వీ రందరికంటెను సత్యమే నీకు పరమమిత్రము ! సత్యమే పరమశరణ్యము ! బంధువులు, మిత్రులు, భార్యాభర్తలు మొదలగు బంధనము లన్నియు నొక్కత్రుటికాలము మాత్రమే యుండి నశించుచుండును. సత్యము నిత్యము నీలోనే యుండును. నీ నిజాత్మయే సత్యము ! నీ భార్యాబిడ్డలకంటెను, స్నేహితులకంటెను సత్యమే నీ కెల్లపుడును

సమీపమున నుండును. తల్లిదండ్రులకంటెను, బిడ్డల
కంటెను, పాలకునికంటెనుకూడ సత్యమునే యెక్కువ
గా గౌరవింపుము. ధర్మరాజు భార్యాసమేతుఁడై భీమా
ర్జున నకుల సహదేవులతో మహాప్రస్థానమును సలుప
హిమాలయశిఖరములను దాటిపోవుచుండెను. అతఁడు
ధర్మపథమున బోవుచుండెను; సత్యము నన్వేషించు
చుండెను అతఁడు ముందరపోవుచుండ ననుజులును భార్య
వెనుక నతని ననుసరించుచుండిరి. భీమార్జున నకులసహ
దేవు లొకరి తరువాత నొకరు పోవుచుండిరి. ద్రౌపది
చిట్టచివరనుండెను. కొంతదూరము పోవుసరి కామె కల
నట కలిగెను. ఆమె ముందు కొక్కయడుగైనను పెట్ట
జాలక కాళ్ళు బొబ్బలెక్కుచు రక్తము కారుచుండ
రోదనచేయుచు భర్తను పిలుచుచుండెను. ధర్మరాజు
సత్యముపై దృష్టి నిలిపి తనయవధిని చేర నుత్సుకుఁడై
పోవుచుండెను. అతఁడామెరోదనమును విని వెనుకకు

తిరుగక తనవద్ద కెక్కిన పరుగెత్తుకొనివచ్చినయెడల తా
నామెకు చేయూత నిచ్చి తీసికొనిపోయెదనని చెప్పెను.
కాని యామె యొక్క యడుగైనను ముందుకు వేయజాల
క నిలచిపోయెను. ఆమె ముందుకు పోజాలదు. ధర్మరా
జు ధర్మపథములో నొక్కయడుగైనను వెనుకకు వేయ
డు. చివర కామె ముందుకు పోజాలక నేలను గూలెను.
ధర్మరా జెంతమాత్రమును చలింపక తనభార్యకొరకై
నను సత్యపథమును వీడక ముందుకు పోయెను. నీపూ
ర్వజన్మలలో నీ వనేకవేల భార్యలను కలిగియుంటివి.
నీకు ముందు జన్మలున్నచో, నెంతమంది భార్యలుందురో
యెవరి కెరుక ! వెనుక నీ కెంతమంది బంధువులుండిరి !
ఇకముందు నీ కెంతమంది బంధువులుందురో యెవరి
కెరుక ? ఈ బంధనములకొరకు నీవు నీ సత్యమార్గము
ను విరమించుకొనరాదు. నీ భార్యకంటె సత్యములో
నెక్కువ గౌరవముకలదు ! సత్యము మానవజాతి కంత

కును సంబంధించినది ; అది యన్నికాలములకును సం
బంధించినది ; అది సనాతనమైనది. నీ ప్రాపంచిక బంధ
నము లట్టివి కావు. అవి తృటిలో నశించునవిమాత్రమే !
నీ వాక్కధర్మమును తప్పక గ్రహింపవలసి యున్నది.
నీ కేది మంచిదో, నీ కేది యథార్థమైన మంగళమును
చేకూర్చునో నదియే నీ భార్యకును, నీ సహచరులకును
కూడ మంగళప్రదమని ముమ్మాటికిని గ్రహింపుము.
ఇది పరమసత్యము ! నీ భార్యకు దూరముగా నుండుట
నీకు శ్రేయస్కరమగుచో నామెకును యిదియే శ్రేయ
స్కరమని గ్రహింపుము. ఇది యొక యమోఘమైన
ధర్మము. నీ వెనుకనున్న దివ్యత్వమే నీభార్య వెనుకను
యున్నది. ఇట్లు యుధిష్ఠిరుని భార్య పడిపోయెను. అత
డు ముందుకు పోవుచు తనసోదరులను తన వెంటనంటి
రమ్మనెను. అట్లు వారు మరికొంతదూరము పోయిరి.
ఇంతలో సహదేవుడు పడిపోయెను. అతడు యుధిష్ఠిరుని

పిలిచి " నేను పడిపోతిని ; నేను చనిపోవనున్నాను. నన్ను రక్షింపుము ; రక్షింపుము " అని కేకలిడెను. కాని యతడు వెనుకకు మరలలేదు. " ఈ కొద్దిదూరమెట్లో కష్టపడి రమ్ము. తరువాత నిన్ను నేను తీసికొని పోయెదను " అని యతడనెను. సహదేవు డొక్క యడుగైన కదపలేకుండెను. ధర్మరాజు ముందుకు పోయెను. సహదేవుడు నేలగూలి చనిపోయెను. ఇంతలో మరియొక సోదరుడు పడిపోయెను. అతడుకూడ ధర్మరాజును వెనుకకు పిలిచెను. కాని యతడొక్క అంగుళమైనను వెనుకకు మరలిరాలేదు. ఈ విధముగా నతని సోదరులందరును మార్గమధ్యమున చనిపోయిరి. ధర్మరాజచంచలుడై తన ధర్మపథమున బోవుచు చిట్టచివరకు తన పరమావధిని చేరెను ; అతడు సత్యదేవతను సమీపించెను. ధర్మదేవతయే యతనికి ప్రత్యక్షమయ్యెను. అతడు ధర్మరాజును తనశరీరముతోనే స్వర్గమునకు

రమున్నని యాహ్వానించెను. కాని యతని ప్రక్క నొక కుక్కయుండెను. " ఓ సత్యదేవతా ! ఓ ధర్మదేవతా ! నే నీస్వర్గమునకు రావలెనని నీవు కోరుదువేని నాతో నీకుక్కనుకూడ రానీయవలెను. నాతో నీకుక్కనుకూడ స్వర్గమునకు రానిమ్ము " అని యుధిష్ఠిరు డనెను. " ఓ యుధిష్ఠిరా ! అ దెట్లుసంభవము కాగలదు ? నీచమైన యీకుక్కకు స్వర్గమునకు వచ్చు నర్హత లేదు. అది యింకను మానవాదిజన్మముల , నెత్తవలసియున్నది. అది మానవజన్మ నెత్తి యతిపవిత్రజీవనమును చేసిన పుడే స్వర్గమునకు రాగలదు. ఈ శరీరముతో స్వర్గమునకు వచ్చుటకు నీ వొక్కడవే యర్హుడవు. ఈ కుక్క కట్టియర్హత లేదు. " అని యా ధర్మదేవత బదులుపలికెను. అప్పు డాయుధిష్ఠిరు డిట్లు నుడివెను. " ఓ ధర్మదేవతా ! నే నిచ్చటకు నీకొరకే వచ్చితిని. కాని స్వర్గము కొరకు రాలేదు. నీవు నన్ను లోకోత్తరమైన స్వర్గము

లోనికి గొంపోవ నెంచుచో నీకుక్కనుకూడ నాతో రానివ్వవలసియుండును. నాభార్య నాతో రాజాలక ధర్మమార్గమధ్యమున పడి చనిపోయెను. నాచిన్నిసోదరుడు నన్ననుసరింపజాలక మార్గమధ్యమున యలసి చనిపోయెను; నా తక్కినసోదరులగతికూడ నట్లే యయ్యెను. వారు నన్ను విడిచివేసిరి; వారు దుర్బలులైరి; అనేకమోహములకు లోబడి వాటికి దాసులైరి. కాని యీకుక్కమాత్రము నన్ను విడువక నాతో యింతవరకును వచ్చుచునే యున్నది. అది నాబాధలను, నాకష్టములను, నాశ్రమను, నావిచారములను, నాపోరాటములను నాతో సమముగా పంచుకొనుచు వచ్చుచున్నది. కనుక నది నాతో సమముగా నీస్వర్గమును కూడ యేల పంచుకొనరాదు? ఈకుక్క వచ్చుటకు వీలులేనిచో నాకట్టి స్వర్గమక్కరలేదు. నాకట్టిదానితో ప్రయోజనములేదు". ఆ ధర్మదేవత యుధిష్ఠిరు నీవరము తప్ప

ను గేవరము నైనను కోరుకొనుమని మరల ప్రార్థించెను. యుధిష్ఠిరుడు దండముల కొప్పుకొనక “ఓ ధర్మదేవతా! నీతో నాకికపనిలేదు. నీవు సత్యదేవతవుకానేరవు. నీవు బ్రహ్మవు కావు సరికదా నీవొక బ్రహ్మరాక్షసివి కూడ కావచ్చును. నీవే సత్యముగుచో నీవేల యిట్టి యక్రమమునకు, నిట్టియన్యాయమున కొడిగట్టుదువు. నీవు నాకొక్కనికే యీస్వర్గసౌఖ్యమున కనుమతించి నాతో నష్టకష్టములను, పడరానిపాట్లను పడిన యీకుక్కకుకూడ నాతో సమముగా స్వర్గసౌఖ్యము నీయకుందువేని నీ వెట్లు సత్యదేవతవు కాగలవు? ఇది నీకెంతమాత్రమును యుచితముకాదు.” అని మందలించెను. అప్పుడా సత్యదేవత తన నిజరూపమున ధర్మరాజుకు ప్రత్యక్షమయ్యెను. ఆకుక్కకూడ తన నిజస్వరూపమును దాల్చెను. విశ్వచక్రము నంతను పరిపాలించు పరమేశ్వరుడే యాశ్వానరూపమును దాల్చెను. ధర్మరాజున కీకఠినపరీక్ష యొ

సగబడెను. అత డందులో నుత్తీర్ణుడయ్యెను.

నీ వి ట్టిసత్యపథమున నిర్భయముగా బోవలెను. ధర్మమార్గమున నీలో సహాయముగా నీయున్న దమ్ములు, ప్రాణమిత్రులు, భార్యాపుత్రులు లేక మరెంతటివారు గాని రాజాలక ఒకకుక్క సైతము రాగలుగునేని నీ కందరికంటె నదియే సన్నిహితురాలు; అదియే ప్రియతమమైన దని గుర్తింపుము. సద్ధర్మాచరణము తోడ్పడువారి నే నీవు స్నేహితులనుగా గ్రహింపవలెను గాని నీయవినీతికి మరింత చేయూతనొసంగువారిని నీ వెన్నడును దరికి రానీయరాదు. అట్టివారితో సాంగత్యమున్నచో నీకు విచారములు, కష్టములు, యమబాధలు తప్పవు.

ఒకహిందూసన్యాసి కడునాకలిగొని యొకనాడువీధులలో భిక్షకొరకు తిరుగుచు నొకగృహమునకు వచ్చెను. ఆయింటియిల్లాలతని యాక్రోశమును విని మధురాహారములను దెచ్చి యతని కిడెను. ఆమె కడుసౌందర్యవం

తురాలు. ఆయోగి తన కిడిన యన్నమును తీసికొని తనచోటుకు పోయి యాకలి దీర్చుకొనెను. అతడు మరునాడుకూడ నట్లే భిక్షకొరకు వచ్చెను. ఆనాడుకూడ నాయువతి రుచ్యమైన భక్ష్యములను దెచ్చి యతని కిడెను. అత డెప్పటివలె తనమధూకరమును తీసికొని యడవికి పోయెను. మూడవనాడుకూడ నతడు మరల రాగా నామె మధురపదార్థముల నతని కిచ్చుచు "నేను నీకొరకెంతసేపటినుంచియో వేచియుంటిని. నిన్ను చూచుటకు నా కండ్లు కాయలు కాచినవి. నీవు నాహృదయమును హరించితివి. నీ నేత్రియుగ్మము నన్నాకర్షించినది" అని మృదుమధురస్వనమున బలికెను. ఆ మాట లామెనోటినుండి వచ్చుటతోడనే యతడు మాటాడక వెంటనే వెడలిపోయెను. అతడు మరియొకచోటకు పోయి కొంతయాహారమును తెచ్చుకొని తన నిలయము నకు పోయెను. అత డాసౌందర్యవతి యిచ్చిన యన్న

మును నదిలో పారవేసి రెండవతల్లి పెట్టిన యన్నమునే భుజించెను. అతడు మరునాఁ డేమిచేసెనో మీ రెరుఁగుదురా ? అత డొకయినుపకడ్డీని తీసికొని కొలిమిలో నెఱ్ఱగా కాల్చెను. దానితో తన రెండుకంటిగ్రుడ్లను పొడుచుకొని వాటిని నొక జేబురుమాలులో కట్టుకొని యతడు కర్ర చేతబూని తడుముకొనుచు యథాప్రకారముగా భిక్షకొఱకు వచ్చి తన్ను ప్రేమించితినని చెప్పిన యాయువతిగృహమున కే పోయెను. ఆమె యతనిరాక కత్యాతురతతో నెదురుచూచుచుండెను. అతడు తిన్నగా యామెవద్దకు పోయి నేలవైపు చూచుచున్నట్లు కండ్లు క్రిందకు వంచెను. ఆమె యతిసంతోషముతో మధురాహారములను తీసికొనిరాఁగా నత డామె కాకంటిగ్రుడ్లలను రెంటిని యిచ్చి "తల్లీ! తల్లీ! ఇవిగో! ఈగ్రుడ్లలను నీవు తీసికొమ్ము! ఈపాపిష్ఠికండ్లు నిన్ను మోహపరచినవి ! ఇవి నీ కమితశ్రమను కలుగజేసినవి కనుక

నీవు వీటినిగ్రహింప నర్హురాలవు. నీవు వీటిని ప్రేమించుము; నీవద్ద నుంచుకొమ్ము; నీయిష్టమువచ్చినట్లు చేసికొమ్ము! కాని నన్నుమాత్రము వెనుకకు బడద్రోయకుము; నాయభివృద్ధి కడ్డురాకుము! నన్ను సత్యపథము నుండి కూలద్రోయకుము!" అని చెప్పెను.

చూచితిరా! మీమార్గమునకు మీకండ్లు అడ్డుతగులునేని మీరు వాటినికూడ పరిత్యజింపవలెను. నీశరీర మంతయు నంధకారములో, నజ్ఞానములో పడి క్రుళ్ళుటకంటె నీ భౌతికశరీరమునకు కాంతి కొరవడినను భంగము లేదు. మీ కిదియే మార్గము.

మీ శరీరములో నేయవయవముగాని, ధనము గాని, భార్యాపుత్రులుగాని మరేదికాని మీధర్మపథము న కడ్డువచ్చునపుడు వాటిని త్రోసివేయుము. నీభార్యా పుత్రులయెడలగాని, నీబంధువులయెడలగాని, ధనధాన్యాదులయెడలగాని నీవు కనబర్చు ప్రేమలో నొకపిస

మంత్రైనను భగవంతునికొరకు, సత్యముకొరకు, బ్రహ్మ జ్ఞానముకొరకు నీవు చూపగలుగుదువేని నీ కీనిమిషమందే సత్యముద్యోతకము కాగలదు. నీ వొక్కసారి సత్యమును గ్రహించి నీ త్రోవలో మొట్టమొదట తగులుచుండు బంధనములను, మోహములను పోనాడగలిగితివేని నీ మార్గమంత కర్కశప్రాయము కాదని నీవే గ్రహింతువు; అది దుస్తరము కాదని నీకే తెలియును. సత్యపథము సూదిమొనకంటెను సన్నముగా నుండునని చెప్పుచుందురు; సత్యపథము కత్తివాయివంటిదని వేదములలో కూడ కలదు. కాని యది పూర్తియైన సత్యము కానేరదు. మొట్టమొదట నది యట్లే యుండును. ఒకసారి మామూలుగా మన కడ్డుతగులుచుండు మోహములను త్రెంచివేతుమేని మార్గమెంతయో సులభమగును; విశాలమగును; ఆనందమయమగును. ఈవిశ్వమంతయు, నీప్రకృతియంతయు నీయడుగులకు మడుగు

లోగుచు నీకే సహాయముచేయును ; సర్వమును నీపక్ష
ము వహించును. మోహములు, కష్టములు, బాధలు,
పోరాటములు వ్యతిరేకశక్తులన్నియు నిన్ను భయపెట్టు
ను ; బెదరించి చూచును ; కాని యవి నిజముగా నీ
కెట్టి యపకారమును చేయజాలవు. అవి నిన్నెదుర్కొ
నునపుడు నీవు కం[illegible]జేసి వాటి నెదుర్కొందువేని
యంతటితో నవి శాంతించును; సృష్టియంతయు, ప్రకృ
తియంతయు, నీకు ' దాసోహం ' అగును ; నీపాదముల
కడకువచ్చును. దీనిని నీ వనుభవములో చూడగలవు.

రాముడు సత్యమును (సీతను) అన్వేషించుచుం
డెను. అతడు సత్యమును తిరుగ ప్రతిష్ఠింప యత్నించు
చున్నపుడు ప్రకృతియంతయు నతనికి సేవజేసెను. వాన
రము లతనికి సైన్యమయ్యెను ; ఉడుత వారధిని కట్టుట
లో తోడ్పడెను. శత్రువు నోడించుటలో పక్షు లతనిపక్ష
మున పోరాడెను. చివరకు రాళ్ళుకూడ నతనికి తోడ్ప

